శ్రీ సర్వేశాయ నమోనమః

# ఆదినారాయణశతకము.

ఇది

శ్రీమదాంధ్ర మాఘపురాణనిర్మాణధురీణ
శ్రీమన్నారాయణ చరణారవింద పారాయణపారీణ

## అబ్బరాజు శేషాచలామాత్యమణి

ప్రణీతము.



తత్పుత్ర
హనుమంతరాయశర్మ పాకయాజి పరిశోధితము.

బ్రహ్మశ్రీ దోనెపూడి పార్థసారథిగారి ద్రవ్యసాహాయ్యముతో

బెజవాడ
ఆంధ్రగ్రంథాలయ ముద్రాలయమున
క. కోదండరామశర్మగారిచే ముద్రితము.

౧౯౩౪

 [వెల రు 0—1—0.

# విజ్ఞప్తి

ఈ శతకమును మాతండ్రిగారు 28 సంవత్సరములకు పూర్వము రచించి యుండిరి. భక్తిరసపూరితము లగు పూర్వకవి విరచిత శతకముల కెందును దీసి పోదనితోచి, దీనిని ముద్రింపింతమని నే నెన్నియోమారులు ప్రయత్నించితిని గాని తాత్కాలిక ద్రవ్యాభావముచేత నైననేమి, ఇతరాంతరాయములవలన నేమి యిప్పటివరకు దీనిని ముద్రింపఁజేయఁజాలక పోయితిని. కాని, యొక నాఁడు బ్రహ్మశ్రీ దోనేపూడి పార్థసారథిగారీశతకమువ్రాతప్రతిని జూచుట తటస్థించినది. దీనిఁ జదివినంతనే ముద్రింపించి, లోకమున కిద్దాని జదువనవకాశముఁ గల్పింతమని వారి కవ్యాజప్రేమ జనించి, ముద్రణమున కగువ్యయమును నా కొసంగి, ముద్రణ మందు భాగ్యమును గల్పించి, నాకృతజ్ఞతకుఁ బాత్రులైరి. వీరికి భగవంతుఁడు పుత్రపౌత్రలాభంబును నాయురారోగ్యైశ్వర్యంబులను నితోధికముగా నొసంగి రక్షించుగాకయని కోరుచున్నాను.

గ్రంథప్రాశస్త్యముంగూర్చి నే ముచ్చటించుట కుడువఁబోవువారలకుఁ గూరలరుచి తెలిపినట్లని యెంచి పాఠకమహాశయులకే దాని వదలితిని.

రేపల్లె,
25-10-34.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి.

శ్రీ కృష్ణాయ నమః.

# ఆదినారాయణశతకము.

శార్దూల మత్తేభ వృత్తములు.

—* శేషాచలకవీయము *—



వాణీశభవాదిసన్నుత! రమా ♦ చిత్తేశ! నాగేంద్రసం
సేవాంఘ్రిద్వయ! భాస్కరేందునయనా! ♦ చిద్రూప! భక్తప్రియా!
భవాతీత! సురేంద్రవందిత! మహా ♦ బ్రహ్మాండ భాండోదరా!
వేవేగం గరుణింప నాదెసకు రా ♦ వే! యాదినారాయణా! ౧

శ్రీవిఘ్నేశుని పాదపద్మయుగము ♦ న్సేవించి, త్రైమూర్తులన్
భావంబందున నిల్పి, వాణిసతులం ♦ బ్రార్థించి, వ్యాసాదులం
బ్రోవంజాలిన నిన్ను నాదుమదినిం ♦ బొందంగ నుతుల్ సేయుచున్
శ్రీవిశ్వేశ రచింతుఁ బద్యములు తం ♦ డ్రీ! యాదినారాయణా!

లోకాతీతజ! క్షత్త్రియైకభరణా! ♦ లోకేశ! విశ్వంభరా!
కాకుత్స్థాన్వయవార్ధిపూర్ణిమశశీ! ♦ కౌసల్యగర్భోదయా!
సాకేతాధిప! జానకీరమణ! సా ♦ క్షాత్కారముం జూపవే
రాకాచంద్రముఖారవింద! రఘువీ ♦ రా! యాదినారాయణా!

నీవాఁడన్ శరణంబు వేడితి మది ♦ న్నిక్కంబుగా నమ్మితిం,
గావంగాఁ దగు నీదుబంటుకరణిం ♦ గారుణ్యపాథోనిధీ!
సేవం గోరుచునుండు నన్ను నిఁక నీ ♦ చిత్తంబులో నేమిగా
దేవాధీశ! తలంచితో పలుకరా ♦ దే? యాదినారాయణా! ౪

జగముల్ నీట మునింగి సప్తజలధుల్ ♦ సంధించి యేకార్ణవం
బగు వేళం జతురాననుండు నిదురం ♦ బ్రాపింప బ్రహ్మాండముం
దగం(బోషింపం)దలంచి గర్భమునం ద♦ద్బ్రహ్మాండముల్ నిల్పియే
పగిదింగాచితి విష్టపత్రయము దే♦వా! యాదినారాయణా! ౫

కరి నీటం గ్రహబాధ కోడి నిను సు♦జ్ఞానంబుతోం బిల్వంగా
సిరితో నడ్డెన కేగుదెంచి మకరిన్ ♦ శిక్షించి వేవేగం ద
త్కరి రక్షించిన భక్తవత్సల! హరీ! ♦ కంజాతపత్రేక్షణా!
సరి నీ కెవ్వరు పోల్చిచూడంగ రమే♦శా! యాదినారాయణా!

ధనదారాసుతబంధుమిత్రభటులం ♦ దథ్యంబుగా నమ్మి యీ
మనుజుల్ తత్పరిరక్ష సేయుచు నినుం ♦ బాటించి వర్ణింప కే
యానయంబుం గృహమేధులై తిరిగి వా♦రంత్యంబునం గాలుచే
తను బెందుర్గతిం ద్రోయనయ్యెదరు కా♦దా? యాదినారాయణా!

నీనామాక్షరమంత్రరాజము మది ♦ న్నిత్యంబు వర్ణించినన్
నానాజన్మకృతాఘముల్ వదలి సం♦న్మార్గంబున న్ముక్తికిన్
మానాథా! యరుదెంతురందు బుధు;లా♦మంత్రంబు నేభక్తితో
ధ్యానంబుంబొనరింతుం బ్రోవంగదవ♦య్యాయాదినారాయణా!

అతిఘోరంబగు పాపకర్మముల నే ♦ నశ్రాంతముం జేయుచున్
సతతంబుం బ్రమదాదిమోహముసనం♦సారాంధకూపంబునన్
ధృతిమై రాజసతామసంబుల మదో♦ద్రేకుండనై చిక్కితిన్
వెతలం బెట్టక నీదు సత్పదము నీవే ♦ యాదినారాయణా! ౯

సిరియుం బంటవలంతియుం గెలకుల ♦ న్సేవింప, దిక్పాలకుల్
పరివేష్టింప, సనందనాదిమునులుం ♦ బ్రార్థింప, నీమూర్తి భూ
సురులు న్వేదవిధి న్నుతింపఁ, గుజన♦క్షోభంబు సత్యాత్మక
స్థిరతోషంబు వహింపఁ గ్రాలుగుణవా♦ర్ధీ! యాదినారాయణా!

ఆశాపాశముచేతఁ గట్టువడి నే ♦ నంధత్వముం బొంది, హృ
త్కోశంబందు భవత్కథల్ దలఁప కెం♦తో బుద్ధిమాంద్యుండనై
లేశంబైన స్వధర్మవర్తనల నో♦లిం బోవఁగాలేక నే
నీశా! కాలమువుచ్చితిన్ మనుప రా♦వే! యాదినారాయణా!

పరదారాగమనాభిలాష మదికిం ♦ బ్రాపింపఁగా, నంతటం
బరవిత్తం బభివృద్ధికై యనృతముం ♦ బాటించి, కల్మారు త
ద్ద్వారున న్నిక్కములంచు గల్లలను సం♦భాషించుచుం దుష్టుఁడై
నరకప్రాప్తుఁడుగాక సద్గతికిఁ బో♦నా? యాదినారాయణా! ౧౨

ఎన్నెన్నో ఖలజన్మముల్ గడచి నా ♦ కీమర్త్యజన్మంబొగిన్
సన్నాహంబునఁ గల్గెనో యనుచు లో♦ సందేహ మేతెంచు, నీ
కన్న న్వేరొకదైవముం గలదె స♦త్కారుణ్యముం జూపి మా
యన్నా! నీపదమందుఁ జేర్పఁగదవ♦య్యా! యాదినారాయణా!

స్వకులాచారము మాని హీనకులసే♦వల్ సేయుచున్ వారిచే
సకలంకస్థితి ద్రవ్యముం గొనుచు స♦త్యాసక్తిఁ బెంపొందఁ బు
త్రకులం బంధుకళత్రపోషణలచే♦త న్మించువా రాదటన్
వికలంబై చెడిపోదు రేలుటకు రా♦వే! యాదినారాయణా!

పక్షపాతము లేక యెల్లపుడు స♦ర్వప్రాణిసంఘంబులన్
రక్షింపంగలవేల్పు వీవ యితరుల్ ♦ రక్షింపఁగా నేర్తురే
యక్షీణం బగుముక్తిఁ గోరి మది ని♦ న్ధ్యానించితిన్ దేవ! నీ
దాక్షిణ్యంబును జూపవేల దయ లే♦దా? యాదినారాయణా!

అరిషడ్వర్గములం జయించుట కశ♦క్యంబై మహాఘోరదు
స్తరసంసారసముద్రముం జొరి కళ♦త్రభ్రాతృపుత్రాదులన్
శరజాలంబులచేతఁ జిక్కి వెడల ♦ న్సామర్థ్యమే లేక నీ
వరపాదాబ్జముఁ జేరినాఁడఁ గను, దే♦వా! యాదినారాయణా!

దితిసంతానము విష్ణుపత్రియును ను♦ద్రేకించి పీడింప ది
క్కృతులు న్యాకృతి వేదమంత్రములు, నిన్ ♦ బ్రార్థింపఁ గౌసల్యకు
న్సుతుఁడౌచున్ జనియించి దానవుల మే♦ల్చించి సత్కీర్తిమై
వెతలం దీరిచి ప్రోచినట్టిదొర వీ♦వే యాదినారాయణా! ౧౭

అరవిందంబులకంటెఁ గోమలములై♦ యందంబులైయొప్పు నీ
చరణంబుల్, తులసీదళంబులను బూ♦జల్ సేయుమర్త్యుండు నీ
ధరపై నెక్కడ జన్మ మొందక మహా♦ధన్యుండుఁ బుణ్యుండు నై
పరమంబైన భవత్పదంబు గను దే♦వా! యాదినారాయణా!

మును నిన్ గొల్చిననారదాదిమును లీ♦ ముల్లోకముల్ దిగ్గుచున్
ఘనతం జెందినటుల్ పురాణముల నా♦కర్ణించి కౌతూహలం
బున నాకోర్కియు నట్లు సిద్ధియగునా?♦ భూమీశ్వరా! యంటి నా
మనవిం జేకొనుమయ్య! మేరుగిరిధా♦మా! యాదినారాయణా!

భూనాథా! యొకవిన్నపంబు గల దీ♦భూలోకమం దంతటన్
నానాజన్మల కర్మలం గెడప వి♦జ్ఞానంపు దివ్యౌషధం
బౌనారాయణమంత్రిరాజ, మిలఁ జె♦న్నారంగ నీమానవుల్
దానింగాంచరు నీదుమాయయిది కా♦దా? యాదినారాయణా!

హాల నజాగ్రాంకుశ శంఖ చక్రశుభ రే♦ఖాలంకృతంబై మహో
జ్జ్వల మా త్వత్పదపద్మసేవ యనునా♦వం జేసి నే దానిచేఁ
గలుషంబైన భవాబ్ధి దాఁటుటకునై ♦ కాంక్షించి నీభక్తిమై
నెలమి న్నిల్పితి మోక్షమిచ్చుటకు రా♦వే! యాదినారాయణా!

హరి! విశ్వంభర! చక్రపాణి! మధుకం♦సారాతి! శ్రీకృష్ణ! శ్రీ
ధర! పద్మాక్ష! ముకుంద! వామన! సురా♦ధ్యక్షా! రమానాథ! సుం
దరకుందస్మితవక్త్రపద్మ! వరదా! ♦ దామోదరా! విష్ణు! మం
దరభూభృద్ధర! నీలదేహ! యదునా♦థా! యాదినారాయణా!

భవముం దోషము రూపకర్మములచేఁ ♦ బాటొందు నీదేహికిన్
భువియందున్ ఖలజన్మ లెన్ని చనెనో ♦ భూనాథ! ము, న్నింక నే
భవముల్ నాకు లభించునో తెలియ దీ♦ భ్రాంతిం దగం గోసి త
ద్భవదోషంబులడంపుమా కృపను దే♦వా! యాదినారాయణా!

కలిసారణ్యకుఠార! పామరజనుల్ ♦ కార్పణ్య మేపారఁగాఁ
గలహంబే పనిగా నటింపుచు, మహా♦కామాంధకారంబుచే
వలలోఁ జిక్కినపక్షిమాడ్కి నలిగా ♦ వాపోవుటే కాని మీ
లలితంబౌ పదపద్మముల్ తలఁపరే♦లా? యాదినారాయణా!

కామక్రోధము లూడ్చి శుద్ధతనువై ♦ కళ్యాణమైయున్న ని
న్వేమార్గ భజియించుమానవుఁడు స♦వ్రీడాపరుండై సదా
ధూమాగ్నిక్రియ నుండడే నేని కడు ని♦ర్ధూతాఘుఁడై యంత నీ
ధామంబుల్ గనువంత బాసియదు చం♦ద్రా! యాదినారాయణా!

తనమే నొక్కఁడుపామునోటఁబడఁ ద♦ద్ద్వారంబునందుండి యా
గను మ్రింగఁ గమకించుకప్పవగిదిం ♦ గాలాహిచేఁ జిక్కి వే
చనునాయుష్యముపా ♦కొంత దెలియం♦జాలంగలేకే దురా
శను వర్తించెద రీజనుల్ జగదధీ♦శా! యాదినారాయణా! ౨౬

ధనవిద్యాబలశౌర్యసంపదలచే♦తం గర్వదుర్వారుఁడై
యనయంబుల్ బరనిందనాత్మనుతులం♦ బ్రావీణ్యుఁడై యంతేఁ బో
కను స్వభ్రాతృలబంధువర్గము నెడం ♦ గారుణ్యముం దప్పఁజూ
చిన కాఠిన్యుఁడు కూలఁడయ్య! గుణభా♦సీ యాదినారాయణా!

మనముల్ వాక్కునుగర్మమొక్కటిగనై ♦మాన్యుండనంజెల్లు స
జ్జనుఁ డిందందు సుకీర్తిసిం బడయుఁగాఁ♦జాలుల్, జగంబందు దు
ర్జనుఁ డామూఁటిని మూఁడుమార్గముల సం♦స్థాపించితాలోకనిం
దనుఁ బొందుం దుది దుర్గతింమునుగుఁగా♦దా? యాదినారాయణా!

ధనభూకాంక్షల నీతిఁ బోవిడిచి త♦ద్దాయాదవర్గంబుమీఁ
దను గౌటిల్యమనస్కుఁడై ప్రబలి గా♦ఢ ల్పైకుక్కు గల్పించి చం
పను యత్నించినధార్తరాష్ట్రుఁడును ని♦ర్వంశంబునై పోయె నే
మనుజుండైనఁ జెడుండె యట్లుచన రా♦మా! యాదినారాయణా!

జితకామాతురవృత్తిచేఁ దగిలి ని ♦ న్సేవింప నిష్పాపుఁడై
గతి నీవే యని రేయునుం బవలు నీ ♦ కళ్యాణసంకీర్తనల్
సతతంబుం దలపోయుసజ్జనుఁడు సు♦జ్ఞానంబునుం బొంది యం
చితకీర్తిం గనుఁ గస్తి బాసి గుణభా♦సీ! యాదినారాయణా!

అకలంకం బయినట్టినీదుచరితం ♦ బశ్రాంతమున్ జిహ్వాయం
దకలంకస్థితిఁ జేర్చి మానవుఁడు ని ♦ న్నర్చింప దోషావళుల్
వికలంబై చెడి యంత్యకాలమున కో ♦ విశ్వేశ! విశ్వాత్మ! నీ
ప్రకటంబైన పదంబుఁ జేరుఁగద దే♦వా! యాదినారాయణా!

యావజ్జీవము దేహసౌఖ్యమునకై ♦ యత్నించువారై భవ
త్సేవం జేయుట మాని లోభరతులై ♦ చీకాకునుం బొంది యో
దేవా! దుర్వ్యసనంబులం బడుదు రిం♦తే, కాని యీమానవుల్
నీవే మూలమటంచుఁ గొల్వ రిలఁ దం♦డ్రీ! యాదినారాయణా!

ధర నీనామపుఁజింత మానవుల కా♦ధారంబునై యుండ నే
మరకుండం బఠియింప కద్ది, యెపుడు ♦ న్మాత్సర్యసంపూర్ణులై
పరులుం దా మనువాదభేదమున సం♦బద్ధాత్ములై యాశచేఁ
బరముం గానరు దుర్గతి న్మునిఁగి దే♦వా! యాదినారాయణా!

కలిదోషం బను వ్యాధిబాధఁ గని నీ ♦ కళ్యాణచారిత్ర మీ
యిలపై దివ్యమహౌషధక్రియయు కా ♦ ఇంపార నద్దానిఁ దా
మలవాటించుక నేయఁబోవక మనో♦వ్యాసంగముం జెంది క
ల్లలతోఁ, బ్రొద్దులు పుచ్చఁజూచెదర దే♦లా? యాదినారాయణా!

త్రిజగంబుల్ గలిగింప బెంప నణఁపన్ ♦ దేవేశ! యొక్కండవై
యజవిష్ణీశ్వరనామభేదముల న♦త్యానందమై యొప్పు నీ
సజలాంభోజ్జ్వలనీలమూర్తి నయనా♦బ్జస్థాయిగాఁ జూపు మో
గజరక్షాపరతంత్ర! ఫుల్లకమలా♦క్షా! యాదినారాయణా! 3॥

పారావారగభీర! భీరుజనతా♦పధ్వంస! వేదాంతసం
చారా! మానిజనానుమోదహృదయా!♦సంగ్రామభీమా! శుభా
కారా! దీనజనార్థికల్పక! రమా♦కాంతామనోహారకా!
రారా పిల్చినఁబల్కవేల? యదువీ♦రా! యాదినారాయణా!

పలుమారుల్ నినుఁ జూచువేడుక మదిన్♦ బ్రార్థింప నీమూర్తి నా
కలలోనైన నొకప్పుడైన నెదురన్ ♦ గల్పింప వే సృష్టి నిం
దెలియంజాలక విన్నవించెదను నీ ♦ దివ్యప్రకాశంబు నే
వలనంగాంతు నెఱుంగఁబల్కుమిఁక దే♦వా! యాదినారాయణా!

సదయుండైన మహాత్ముఁ డీతఁడని ని♦స్సందేహభావంబు నే
వదలంజాలక యేకచిత్తమున, ని ♦ స్వార్థింపఁగా నన్ను నీ
వదయం జూపెడి విద్దె నావలనఁ బెం ♦ పౌ పాపమో లేక నీ
హృదయం బేయెటువంటిదో తెలియఁదండ్రీ యాదినారాయణా!

జూదం బాదిగ సప్తదుర్వ్యసనసం♦క్షోభంబునం దుర్గతిం
బాదం జెందునెకాసి పుణ్యుఁ డగునా?♦పద్మాక్ష! శ్రీవత్స! నీ
పాదాంభోరుహచింత నేచ్చ మదిలోఁ♦ బ్రాపించినన్ సుంత యేన్
బాదంజెందక పుణ్యుఁడౌగద! మహీ♦పా! యాదినారాయణా!

అమరాధీశ్వరుఁ డొక్కనాఁడల సుధ♦ర్మాసీనుఁడై దేవతా
పరిమదానీకవినోదముం దగులుట ♦ న్వాచస్పతిం జిత్తవి
భ్రమచేఁ జూడక స్వర్గభోగములకున్ ♦ స్భ్రిష్టించి నీనామన
ర్మముఁదాల్పన్ సురసేవ్యుఁడా యెఁగదరా♦ మాయాదినారా॥

నిగమంబుల్ గొని సోమకాసురుఁడు ము♦న్నీటం జొర న్వానికై
మగమీనై చరియించి తజ్జలధిలో, ♦ మాత్సర్యసంపూర్ణచి
త్తగతుండైన సురారిఁ బెల్లుజ వెసం ♦ దండించి మర్దించి త
న్నిగమస్తోమము బ్రహ్మచేత నిడు తం♦డ్రీ! యాదినారాయణా!

మును వేల్పుల్ తొలివేల్పు లెల్ల రత్నాకరం♦బుం గోరి యాపాల వె
ల్లిని ద్రచ్చం బెనుమంధరాద్రి మునుఁగన్ ♦ లేఖర్షభుం డాదిగా
ఘనగీర్వాణులు వేడ గచ్ఛపమవై ♦ గారింబు నీవీఁపుతీఁ
టను బోఁ దాలిచి కాచినట్టి మొనగాఁ♦డా! యాదినారాయణా!

అవనిం జాపగఁ జుట్టి చేఁగొని హిర♦ణ్యాక్షుండు పాథోనిధిం
జవమున్ దిట్టతనంబు పెంపు గదురన్ ♦ శౌర్యంబుతో డాఁగఁ బో
తిరివియై దైత్యవరేణ్యునిం దునిమి నీ ♦ శృంగంబునన్ లీలఁ బం
టివలంతిం దమి నిల్పి వెల్గినయనం♦తా! యాదినారాయణా!

అనుజుం ద్రుంచిననిన్ను హేమకశిపుం ♦ డాలంబులోఁ ద్రుంపఁ ద
త్తనయున్ విష్ణువు నిందుఁ జూపుమని, బా♦ధల్ వెట్టి కైసాచి వే
సినఁ దోడ్తోడనఁ గంబము న్వెడలి తా ♦ శ్రీనారసింహాకృతిన్
దనుజుం బట్టి హతం బొనర్ప క్షితినా♦థా! యాదినారాయణా!

బలి, ముల్లోకము లేల వామనుఁడవై ♦ పాకారిబన్నంబులం
దొలఁగం ద్రోసి,రమాధ్యుఁ జేయుటకునై ♦భూతాఘుఁడై నట్టిత
ద్బలిచేఁ గొన్నపదత్రియావనిని స♦ర్వవ్యాపివై నాకమున్
బలిమి న్వజ్రికి నిచ్చినాడవుగద♦న్నా యాదినారాయణా! ౨౫

మఱియున్ భార్గవరామమూర్తివగుచున్ ♦మాత్సర్యసంపూర్ణభూ
వరుల న్నిర్వదియొక్కమారు నెదిరిం♦పం బోరి ఖండించి త
ద్వరరక్తంబునఁ బైతృమేధ మనువొం♦దం జల్పి వేవేగ నీ
ధరణిం గశ్యపమౌని కిచ్చితివిగా♦దా? యాదినారాయణా!

ఇనవంశంబునఁ బుట్టి, దాశరథివై ♦ యేపార భూపుత్రి ల
క్ష్మణుఁడుం దోడుగ దండకాటవిఁ జరిం♦పన్ రావణుం డద్ధరా
తనయం గైకొనిపోవ, వానరులతో ♦ దండెత్తి కీశాధిపుం
డనిఁ దోడై చన వానిఁ ద్రుంపవె రమే♦శా! యాదినారాయణా!

ధరపై దైత్యులు రాజచిహ్నములచే♦తం బుట్టి భూభారులై
చరియింప న్యదువంశవార్ధిశశివై ♦ జన్మించి తద్భారమున్
వరుసం దీర్చి యుధిష్ఠిరుం బృథివిఁ గా♦వన్ రాజుఁగాఁ జేసితౌ
పరమాత్మాహతఁ గృష్ణనామమున దే♦వా! యాదినారాయణా!

సురముఖ్యుల్ నుతియింప, దానవులుసంక్షో♦భింపఁ, దత్పత్నులన్
సురతక్రీడకు దేవె బుద్ధతనువు♦ న్సొంపారఁగాఁ దాల్చి; శం
కరుఁడున్ దైత్యపురత్రయంబుహతమున్ ♦గావింపుచోఁ దోడుగా
శరమై యొప్పవె పార్వతీశునకు నీ♦శా! యాదినారాయణా! ౨౯

కలికాలాంతమునందు మానవులు దు♦ష్కర్మాభిలాషన్ దురా
శలచే సంకరవర్ణులై తిరుగ నీ ♦ శక్తిప్రభావంబుచే
బలువైనట్టి తురంగమెక్కి ఖలులన్ ♦ భంజించి నీకల్కిరూ
పలరన్ దీనులఁ గావఁ జూపెదు గద♦య్యా యాదినారాయణా!

పరుల న్వేడుట యొక్కదానికె కదా ♦ పద్మాక్షు! మీపాదప
ద్మరతిం జెందిననిందునందు సుఖముల్ ♦ తా నందు నారెంటిలోఁ
బరసౌఖ్యంబును మాని ద్రవ్యమునకై ♦ బద్ధానురాగంబుతో
నరుగంజూతురు నంత మొందువరక♦య్యా! యాదినారాయణా!

వసుదేవాత్మజుసత్కథల్ దలఁప కె ♦ వ్వాఁడైన నేమన్నను°
బసలేదంచుఁ దలంచి ప్రేలుచును ద్ర♦వ్యం బర్ధి నార్జించి, దు
ర్వ్యసనుండై కడుదుష్టకార్యములనే ♦ యత్నించుచున్నట్టివాఁ
డిసుమంతైన సుఖంబుఁ గానఁడిలఁ దం♦డ్రీ! యాదినారాయణా!

సిరులెల్లం దన కున్నవాఁడు నినుఁ దా ♦ సేవించుటే లేదుగా,
కరయుం గొల్చినయట్టిమానవుఁడు ము♦న్నర్థంబు గామంబు ను
స్థిరతం జెందఁ గుటుంబవృద్ధికొఱకై ♦ సేవించునే కాని నీ
చరణాబ్జంబులు ముక్తికై కొలువఁ డీ♦శా! యాదినారాయణా!

ఉదయం బాదిగ, నస్తమించువర కీ ♦ యుర్వీజనుల్ పుత్రసం
పదమైఁ దేలుచు, రాత్రికాలమున దం♦పత్యాత్మసౌఖ్యంబుతో
నిదురం జెందుటె కాని యాయువు వృథా♦నిర్మూల మైపోవ నీ
పదముం బొందెడుమార్గ మారయరు దే♦వా! యాదినారాయణా!

అదరా, నిన్నొకసారిదీనుఁ డగువాఁ ♦ డాశించి తాఁబిల్వఁ గా
చెదనంచున్ ధరియించినట్టిబిరు దే ♦ చెంతం బడం ద్రోచితో
పదిలంబుం బొనరించితో మఱచితో ♦ పల్మారు ప్రార్థించు నన్
మదిలో నైనఁ దలంపవేల? రఘురా ♦ మా! యాదినారాయణా!

పాకారిప్రముఖాభివందిత! గజ ♦ ప్రాణావనోత్సాహ త్రై!
లోకారాధ్యుఁడ వంచు నెమ్మదుల నా ♦ లోకించి మౌనీంద్రు లే
పోకల్ బోక ప్రసంగవాక్యములచేఁ ♦ బుణ్యాత్ములై రట్టిని
న్నేకం బైనమనంబునం దలతుఁ దం ♦ డ్రీ! యాదినారాయణా!

విరసోక్తుల్ విడి, నీదుసత్కథలచే ♦ విన్నాణినై, దీనులన్
సరసత్వంబునఁ జూచుచున్, సములతో ♦ సాంగత్య మాధిక్యలం
గర మొప్పంగని ప్రొక్కులొప్పియిడుచున్ ♦ గంజాక్ష యీరీతి నే
నరుఁ డుర్విన్ జననాతఁడే సుజనుఁ డ ♦ న్నా! యాదినారాయణా!

పురుహూతుండసురేంద్రుతోఁ డ, బలిమిం ♦ బోరాడ నయ్యింద్రునిం
గరితో మ్రింగిన వృత్రుగర్భమును వే ♦ గం జించి తా బైటకిన్
వర "నారాయణమంత్రరాజ" మహిమం ♦ స్వచ్ఛంగదా? యేరికిన్
హరినామస్మరణంబు శత్రువిజయం ♦ బౌ నాదినారాయణా!

ఏలాగంటి దురాత్మునేని భరియిం ♦ తే నార్యదుర్మంత్రిదు
శ్శీలుండై యనృతంబులాడుమనుజుం ♦ జేపట్టి మోవంగ నే
జాలం జాల నటించుఁ దొల్లి ధరణీ ♦ చంద్రాస్య వాణీశుతో
నోలిం బల్కిన దుష్టులం దునిమితో ♦ హో యాదినారాయణా!

నను రక్షించుట నీదె భారమయిన ♦ న్నా తల్లి శ్రీదేవితో
మనకుఁ భృత్యుఁడు వీఁడు, కాచుటకు న♦న్నాన్యుండు కాఁడా? యివే
మని యచ్చో విరళంబుగాఁ దెలిసి, న♦న్మన్నింపవే యార్తర
క్షణకు న్నేటరి వైననీకుఁ దగవే ♦ కా? యాదినారాయణా!

సురవైరుల్ భువి రాజులై ధరణికిన్ ♦ శోకంబు వాటింపఁ, ద
ద్భరముం దీర్చుట కబ్జగర్భుఁడు నినుం ♦ బ్రార్థింప, నీభూమియం
దరుదందన్ జనియించి దుష్టహరణం ♦ బౌదాక నిచేయుదు
స్తర కార్యంబులు కొన్ని తెల్పెద నసం♦తా! యాదినారాయణా!

కనుదమ్ముల్ తెరువంగలేని నెలలో ♦ గంసుండు తా బాలఘా
తినియా పూతన ని ♦ న్నణంచుటకు నుద్దేశించి పంపింపఁగాఁ
బనిగా వచ్చినయట్టిదాని విసఁపుం♦బాల్ దాగి యమ్మిత్రికిం
జెనుపా బుత్రిగ నంపినట్టి నలసా♦మీ! యాదినారాయణా!

ఒకనాఁ డాశకటాసురుండు మనమం♦దూహించి నిన్నొంపఁగాఁ,
బ్రకటంబైన తృతీయమాసమున నీ♦పైఁ రాఁగఁ బాదంబునన్
వికలంబై చెడునట్లు తన్ని యతఁడు♦ర్వ్యం గూలి వేవేగ లే
ఫక ప్రాణంబులు వాయఁ జేయవె? మహీ♦పా! యాదినారాయణా!

వెలనొప్ప న్నిను నొక్కయేటను దృణా♦వర్తుండు వే మింటికిం
బలిమిం బె న్నుడిగాడ్పుచాడ్పునను లే♦వ న్వానికంఠంబు నీ
బలుహస్తంబులఁ బట్టి క్రిందఁబడఁ గూ♦ల్పం బ్రాణముల్ వాసియా
యిలపై నాతఁడు గొండవోలెపడెఁగా ♦ దే యాదినారాయణా!

మను దిన్నాఁ డని నిన్ను సోదరసఖుల్ ♦ మర్దింప మీతల్లికిం
గనుపింపంగ యశోదతో, వదన మా♦ఘ్రాణించి దండింపవే
యని బ్రహ్మాండమునోరఁజూపఁగని, య♦త్యాశ్చర్యముంబొందినీ
ఘనమాయన్నుతుఁడంచు నెంచెఁగరిర♦క్షా! యాదినారాయణా!

పాలు న్వెన్నయుఁ దిన్న వాఁడవని లే♦ బ్రాయంబునం దల్లి నిన్
గేలం బట్టిన ఱోలఁ గట్టిన గడుం ♦ గేడింప గాయమ్మ, నా
ఱోలున్ రెండగుమద్దిచెట్లు పడఁగాఁ♦ద్రోయించనై పెక్కుచం
దాలం బత్తిని ముత్తి నిచ్చితివి కా♦దా? యాదినారాయణా!

వనమధ్యంబున గోపబాలకులతో ♦ వత్సంబుల న్మేపునీ
ఘనతం గాంక్రూరరక్కసుండు మదిలోఁ ♦ గన్గొక గ్రమింగంగ ది
గ్గనఁ గొంతుం బిగియింప, వాఁడవలఁ గ్ర♦క్కం దాడలం బట్టిచీ
ల్చిన నాతం డొడలు న్విడం డెగుణరాశీ♦ యాదినారాయణా!

కాళిందీజలసక్తతప్తవిషముం ♦ ఖండింపఁ గద్యాసియా
కాళింగుం బిగఁబట్టి వానిపడగల్ ♦ కాళ్ళన్ జెడన్ మట్టి యా
కాళిందీనదిఁ బాపి తజ్జలము స♦క్కం బ్రాణిసంఘంబులన్
బాళిం గ్రోలఁగఁజేయవయ్యా? మృదుభా♦వా! యాదినారాయణా!

గోపస్త్రీజనసంఘు మాయమునలోఁ ♦ గోకల్ విసర్జించి నీ
ప్రాపుం గోరుచు, వారికేళి విహరిం♦పన్ వారిచేలంబులం
దాపుం జేరి హరింప శీతజలబా♦ధం జిక్కి పెన్సిగ్గులం
దీపింప న్నిను వేడఁ జీర లిడలే♦దే? యాదినారాయణా! ౯౯

తనకై చేయ సుప్రక్రమించుమఖముం♦దప్పించినా వంచు హె
చ్చినకోపంబున గోపబృందములపైఁ♦జీకాకుగా రాలవా
నను వర్షించిన యింద్రుగర్వ మణపం♦దర్పించి గోవర్ధనం
బను శైలంబును గేల నెత్తితిగద♦య్యా యాదినారాయణా!

కాంతారంబున గోపబాలకులతోఁ♦గాసారతీరంబునన్
వింతల్ గంతుల బంతిచల్దిఁగొను ని♦న్వీక్షించి వాగ్జాని, వి
భ్రాంతిం బిల్లల దూడలం గుహను డా♦ప న్వత్సరం, బట్టె నీ
వంతం దద్ఘనరూపముల్ గొనితి కా♦దా? యాదినారాయణా!

మురళీగానముచేత గోపసతుల♦న్మోహంబు నొందింప స
త్వరులై నీకడఁ జేరువారిఁ గని సం♦భావించి వారెంద ఱం
దఱుగా నీ వయి రాసకేళి నిరవొం♦కం దీర్చి సంచారమున్
వరుసం జల్పవె యేకరాత్రిమున దే♦వా! యాదినారాయణా!

నరకుం డుగ్రత నింద్రపట్టణము స♦న్యాయంబుగా నాక్రమిం
ప రయం బార బలారి దీనదశ నిన్♦బ్రార్థింపఁ బ్రాగ్జ్యోతిషం
బిర వొందం జని సత్యతోడ నసురున్♦హింసించి తత్పట్టనం
భేరుదారం బలవైరి కిచ్చితిగద♦య్యా? యాదినారాయణా!

కదనం బందుమహీసుతుం దునుమ,త♦త్కారాగృహాపేతలా
పదియార్వేలగురాచకన్నియలు ని♦న్భావించ వారందఱిన్
విదితం బొప్ప నవానురాగముల వే♦ర్వేర న్వివాహోదినం
వదలం దేల్చిన పుణ్యమూర్తి పరధా♦మా! యాదినారాయణా!

అలరన్ ధర్మసుతుండు సేయుమఖమం ♦ దగ్రంపుదాంబూల ము
జ్జ్వలరీతి న్దగు నీకు నిచ్చిన, సహిం ♦ పన్ లేక చేదీశుఁ డీ
ర్ష్యలసద్భాషణసేయ వానిశిరముం ♦ జక్రాహతిం ద్రుంచి భూ
తలమందుం బడునట్లు చేసితివి కాం ♦ దా? యాదినారాయణా! ౭౫

యవనుం డేపున నిన్ను నొంప మదిలో ♦ యత్నించి ఘోరాటవిం
జవనశ్వంబులు సూపి వెంట దవులన్ ♦ శైలాంతరక్షోణికై
యవలీలం గొనిపోయి వాని నట ము ♦ స్నంతోంబు గావింపవే
యవనీనాథునికంటిమంట, ఖగవా ♦ హా! యాదినారాయణా!

కురుభూమీశుఁడు ద్రౌపదిం బలిమిచేఁ ♦ గోకల్ దీయ మోసలం
చెలువుం జూడన్ సభలోపల స్వనుపబూ ♦ నం గృష్ణ! శిష్టా! గదా
ధర! రక్షాపర! యంచుఁ జిత్తమున సం ♦ న్యాసంబుఁ గావింప నా
దరముం జూపుచుఁ జేలలిచ్చితివి కాం ♦ దా! యాదినారాయణా!

నావిం జెల్లెలు దీని నంటఁ దొసఁగుల్ ♦ ప్రాపించు నాపైఁ గొలల్
బావిం గూలుదుసంచు నించుకయునం ♦ బాటింప కాద్రోవదన్
ద్రోవం గైకొని సైంధవుండరుగఁ గం ♦ టుం దీర్ప రే భీముఁ డా
పై విన్వచ్చుఁడు గూడ నీదుకృప దే ♦ వా! యాదినారాయణా!

కురుపాండుక్షితిరాజవంశజు లతి ♦ క్రోధంబునన్ భూమికై
దురముం జేయఁగఁ గూర్చి పార్థునకుఁ జే ♦ దోఁ ద్దైధరాభారమున్
వరుసం దీర్పఁదలంచి వారిపడఁతుల్ ♦ వాపోవ భూనాథులన్
సరుమూలంబున సంహరించితిగద ♦ న్నా! యాదినారాయణా!

అల భీముండుఁ గిరీటి నీవు మును వి♦ప్రాకారముల్ దాల్చి క
క్షులతో నేగి జరాసుతుం గదనభి♦క్షు న్వేడ మీముగ్గురన్
గలయంజూచి మరుత్సుతుం బిలువ సం♦గ్రామంబునన్ భీముచే
బలిమి న్వాని వధింపఁ జేసితి కా ♦ వా! యాదినారాయణా!

నరపాండుక్షితినాథువంశమును ని♦ర్వంశంబు గావింప ను
త్తరగర్భస్థునిపైని ద్రోణసుతుచే♦తం బన్ను బాణాగ్ని దు
ర్భరమై తత్సతి గర్భరక్షణకు నిన్ ♦ బ్రార్థింపఁ జక్రంబుచే
శరవహ్నిం దొలఁగింపవే సుజనర♦క్షా! యాదినారాయణా!

గతజన్మంబులఁ జేయు పాపములు నా♦కర్షించి యీ దేహికిన్
సతతమ్ము రోగపరిదగ్ధపీడలను ని♦స్సందేహమార్గంబునన్
వెతలం బెట్టఁగఁ బెక్కురూపములచే ♦ విశ్వంభరుండంచు నిన్
మతిలోఁ దల్చ కొకప్పు డారిగతి యే♦మా నాదినారాయణా!

తన దానంబు తనూజతో సమముగాఁ ♦ ద స్గన్నతిం డాసఁ జే
సినదానం బనుజాతతోడ సరిగాఁ ♦ జిత్తంబులో నెంచి, రెం
టిని భ్రమింగంగఁ దలంచువాఁ డిరువురం♦దేపాఱఁగాఁ గూడువాఁ
డని పెద్దల్ వచియింతు రట్టిఁ డిఁక నే♦మా నాదినారాయణా!

ఆపత్కాలమునందు నే నరుఁడు ని ♦ న్నాశించునో వానికిం
దాపై కాచెద నంచుఁ గంకణము చే♦తం గట్టితో యింక నా
లోపాలోపము లెన్నకే కరుణ నాలో♦కించి రక్షింపు నీ
ప్రాపుం గోరితినంటి భానుకులదీ♦పా! యాదినారాయణా!

వర"నారాయణమంత్రరాజము"మహత్త్వంబెన్న శేషాహికిం
దరమే? శాత్రవనాశకంబు సిరికాధారంబు, దోషార్తిని
స్తరణంబుల్, ఖలజన్మనాశకము, మోక్షస్థానభూతంబు నీ
ధరలో నెంతటివారికైన క్షితినాథా! యాదినారాయణా!౧౫

ధాత న్నాభిని బాదపద్మమున ద్యోగంగ న్మది న్మన్మథున్
శీతాంశున్ ముద మొందఁ గాంచిన రమాచిత్తేశ! నీసన్నిధిన్
బ్రీతిం జేరఁగఁ గోరునన్ను నిఁక నేరీతిం దగం గాంచి ప్ర
ఖ్యాతిం జెందఁగఁ బ్రోచెదో తెలియుమయ్యా యాదినారాయణా!

ధనమార్జించి కుటుంబపోషణకునై తన్ జేరు దీనావళిన్
గనకే మేటిగృహస్థు నంచు మదిలో గర్వించి యభ్యాగతుల్
దనయింటం గల నీరు నన్న మిడకే ధట్టించి లే దంచుఁ బో
మ్మను దుష్టాత్ముఁడు నెట్టిదుర్గతికిఁ బోనో నాదినారాయణా!

తరుషండంబున నగ్ని నిల్చినటు లంతర్యామివై యున్నని
న్నరయంజాలక లోహదారుశిలలం దాసక్తి గల్పించి యా
తురులై బాధల నొందకుండుటకు నెంతో భక్తిసంయుక్తి జా
తరలం జేసెద రెంతొ మూఢతను గాదా? యాదినారాయణా!

తన కింద్రత్వము గల్గుచో నహుషుఁ డింద్రాణిన్ రతింగోరి పే
చను వేళన్ శిబికంబు మోయుబుధులన్ శౌర్యంబుతో సర్పస
ర్పనుచుం బల్కిన వారు శాప మిడ సర్పాకారముం జెంది పా
వనిచే శాపము బాపుకోఁడె? యిది త్రోవా? యాదినారాయణా!

వనజాతేక్షణ! భక్తరక్షణ! మనోవాక్కాయకర్మంబులన్
మును దాఁ జేసిన పాపపుణ్యముల నేర్పు న్నీర నీకీయఁగ
ల్గినసుజ్ఞాన మదే యటంచును మును లొప్పున్నాడరే యట్టివాఁ
డనువొందం దవపాదముం గనకపోనా? యాదినారాయణా!

నీపాదాంబుజసేవఁ జేయుకరముల్, నీనామసంకీర్తనల్
వాపోవంగలవాక్కు, నీదుకథలన్ బట్టియుఁజాల్ వీను, ల
ట్లేపారన్ నినుజూచునాడ్కులును, నీకే మ్రొక్కు శీర్షంబునున్
నీపై నుండెడుచిత్త మీయఁగదె తండ్రీ! యాదినారాయణా!

ధనముం బుత్రకళత్రమిత్రగృహసంతానంబుఁ దాఁగల్గి యీ
తనువుం బాసిన దేహి తత్ఫలము నొంటన్ వేరునెమ్మేను గ్రా
కొని తత్కర్మఫలంబునుం గుడువఁ డేటన్ శోణిధ్రిముల్ పైకిఁ బ్రా
కిన, భూమింజొరఁ బాటిసంబ్రమత యోగీ! యాదినారాయణా!

ధనమా దుష్టులకిచ్చి, సాధుతతికిన్ దారిద్ర్యముంగూర్చి త
ద్ధనగర్వాంధుల సాధులోకములు శత్రుద్రం బొట్టకై కొల్వఁ జే
సిననీనేరుపు నెంచిచూడ, సిరిచేఁ జెల్వొందు నిన్ గొల్వ రం
చనియేమో? తెలియంగఁజాల, జగదీశా? యాదినారాయణా!

మతి నెల్లప్పుడు నీపదత్రయముచే నగ్నంబు నొందించి న
న్మతి నిన్నుం దలపోయనేరక మదోన్మత్తుండనై యుంటి నీ
యతసీపుష్పసమానమూర్తిపయి సంత్యాసక్తిఁ బుట్టించి స
ద్గతినిం జూపఁగదయ్యసూరిజనమోదా? యాదినారాయణా·

తరువుల్ పూచినపూత, కాయలగు, త♦థ్యం, బానుమంబెన్న నీ
చరణాబ్జంబులు సోకి దాసులకు దో♦స్సారంబులౌ ఘోటకాం
బరరత్నంబులు, ధాన్యముల్, ధనములుం, ♦ప్రాపించు టేకాకను
స్థిర మోక్షంబును సత్పదం బొసఁగుఁగా♦దే! యాదినారాయణా!

తనువం దూపిరియుండునంతకును గ♦ర్తవ్యంబు నీనామచిం
తన, దాని న్విడి యన్యదైవములగా♦థల్ వేనవేల్ బల్కు నీ
మనుజుల్ చక్కెఱ మాని వేము భుజియిం♦పం జూచిన ట్లౌగదే
సనకాదిస్తుత, కౌస్తుభాదిమణిభూషా! యాదినారాయణా!

ఒకదీపంబున నందు తేజ మది వే♦ రొక్కొక్క దీపంబునన్
బ్రకటంబై కనుపించి వెల్గుక్రియ, నీ♦ బ్రహ్మాండమందెల్ల నీ
యొక రూపంబె యనేకరూపములుగా♦ నుత్పత్తినిన్ సంస్థితిన్
వికలంబుం గలిగించుచుండునది నీ♦వే యాదినారాయణా!

అలఁతుల్ ఖాదనమేహనాద్యఖిలకా♦ర్యాసక్తు, లవ్యక్తదు
ష్ఫలసంరంభులు రోగపీడితులు దు♦ర్వ్యాపారులు న్మందబు
ద్ధులు నల్పాయువు లన్యదైవరతచి♦త్తుల్ క్రోధవిభ్రాంతు లీ
కలిమాయాజను లెన్న భక్తజనర♦క్షా! యాదినారాయణా!

పరముం గోరక దేహమే స్థిరముగన్ ♦ భావించి యద్దానిచే
స్థిరభక్తిం జరియింపఁజాలనిమదో♦ద్రేకుండు జీవన్మృతుం;
డరయంగా నిజదేహమేని నొరులం ♦ దర్పించువాఁ డీభువిం
బరికింప న్మృతజీవుఁడండ్రుగద, దే♦వా! యాదినారాయణా!

శ్రీకౌండిన్యమునీంద్రగోత్రభవుఁ డర్థిన్ దేవభాషాంధ్రభా
షాకావ్యామృతపానలోలుఁ డిడెన్ శార్దూలమత్తేభవృ
త్తాకారోజ్జ్వలసూనమాలికను, నమ్మక్కాంబికానారసిం
హాకాంక్షోద్భవ శేషయాహ్వయుఁడు కొమ్మీ యాదినారాయణా!

కలికాలాబ్దము లైదువేలు గడువంగా నేఁడు సంవత్సరం
బులు నిండంగఁ బరాభవాహ్వయమునం బొల్పారు నీ కాలమం,
దలరన్ నీశతకంబు "ద్రోణపురమం" దార్యుల్ ప్రమోదంబునం
బలుకం, గేవలభక్తిఁ గూర్చితిని కొమ్మా! యాదినారాయణా!

సమాప్తము.